# కృష్ణార్పణం
## (సమ్మానితుని సమాధానం)

ఇప్పటి ఈ సన్మానం చూసినతరువాత నోట మాట రావటం లేదు. పదేసి ఏళ్ళు పనిచేసి విరమించినప్పుడు కూడా గుక్కెడు తేనీరు పొందజాలని నాకు ఈ సన్మానం విస్మాపకం కాక ఎలా ఉంటుంది ?

ఇంతకూ ఇది సమ్మానమా, సన్మానమా, సమానమా ? సమ్యక్ మానం సమ్మానం. అంటే మంచి సత్కారం. సత్ మానం సన్మానం అంటే పండితులు చేయు గౌరవం, లేదా ఉత్తమమైన గౌరవం. లేదా యధార్థమైన సత్కృతి. ఇక మానంతో కూడినది సమానం. సమానులు కావించు సత్కారం 'సమానం' అనవచ్చు. అందుకనే విజ్ఞులు "సమానానాం సుశ్లోకోఽస్తు" అని ఆశీర్వదిస్తుంటారు. ఇంతకూ ఇప్పుడిది ఈ మూటిలో ఏదవుతుంది ?

ఈ సందర్భంలో మరొకమాట. సమ్మానంలో అనేక భేదాలు ఉండటం తమకు తెలియనిది కాదు. వాటా సమ్మానాలు పోటీ సమ్మానాలు, కైంకర్య సమ్మానాలు, కైతవ సమ్మానాలు, రిక్త సమ్మానాలు, ఆత్మకృత సమ్మానాలు—ఇంకా ఎన్నో రకాలు. ఇప్పటి ?

మరొక విషయం స్ఫురణకొస్తున్నది. నాబాల్యంనాటి మాట. ఒక యాయవారపు బ్రహ్మణుడు నిత్యం మా యింటికి వస్తుండేవాడు. వచ్చి "శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః" అని నిలబడేవాడు. నేను దోసెడు బియ్యం పెట్టేవాడిని. ఆయన దానిని పుచ్చుకొని "కృష్ణార్పణమస్తు" అని వెళ్ళిపోయేవాడు. అప్పటికింకా కులదురభిమానం పోలేదు. ఆద్యంతవాక్యాలసు అన్వయించుకోలేదు. నేను ఎవరికి భిక్షం పెట్టాను ? ఎవరు పుచ్చు

కున్నారు? కృష్ణుడు పుచ్చుకున్నాడా? కాదు. ఈయనే స్వయంగా కృష్ణభగవానుడ నని చెప్పుకుంటున్నా డన్న అసూయ కలిగింది. అయినా, పెద్దవాళ్ళకు జడిసి మాటాడలేక పోయాను. ఇలా ఉండగా ఒకరోజున ఒక బ్రాహ్మణ మిత్రుని యింటికి వెళ్ళాను. అక్కడ కూడా ఈ యాయవారపు బ్రాహ్మణుడు తటస్థపడ్డాడు. గృహస్థు పెట్టిన భిక్షను స్వీకరిస్తూ "కృష్ణార్పణమస్తు" అనే అన్నాడు, అప్పుడు బిత్తరపోయాను. ఆలోచన రేగింది. యాయవారపు బ్రాహ్మణుడు దురహంకారియై అన్నమాట కాదు. ఆయన జ్ఞాపకం చేస్తున్నాడు. ప్రతివాడు కర్తవ్యాన్ని స్వార్థరహితంగా పరమేశ్వరార్పణబుద్ధితో చేయాలని, ఆ బుద్ధితోనే ఆ ఫలాన్ని స్వీకరించాలి అని ఉపదేశిస్తున్నాడు

బౌద్ధంలో కూడా ఈ సంప్రదాయమే వుంది. ఇప్పటిది కాదు ప్రాచీనకాలం నుంచి ఇది వస్తూవుంది ఆర్యనాగార్జునుడు కూడా తాను వ్రాసిన "చతుస్తవం" లోని ప్రతి స్తవం చివర "వీనివలన లభించే పుణ్యం లోకానికి సంక్రమించుగాక" అంటూ ఘంటాపథంగా యెలుగెత్తి చాటాడు.

కనుక యిప్పటి గౌరవం కూడా అంలాటిదే. శ్రీ అరవింద సాహిత్యసేవాసమితి వారు రచయితలలోకాన్ని సత్కరించటానికి తలపెట్టి, ప్రతీకగా నన్ను నిలబెట్టి ఈ గౌరవాన్ని యిస్తున్నారని భావిస్తున్నాను. యజ్ఞయాగాది పుణ్యక్రతువులలో పసుపు బొమ్మను చేసి, దాని ముందు ఇష్టదైవాన్ని ఆవహింపజేసి క్రతువు నిర్వహిస్తారు ఆ దైవం ఉత్తరోత్తరా అదృష్టఫలాన్ని అందిస్తుందంటారు. నేను అలాంటి పసుపు బొమ్మనే. అయితే అక్కడ ప్రాప్తించే అదృష్టఫలం నేనూ యిస్తానని అహంకరించలేను. అక్కడ ఆ బొమ్మ ఉలకదు, పలకదు కాని ఇక్కడ ఈ బొమ్మ చేయెత్తి సమస్కరిస్తుంది.

# డాక్టర్ జి. వి. కృష్ణరావుగారి రచనలు

**తత్త్వశాస్త్రం**

ప్లేటో
* అరిస్టోటిల్
కాంటు పరతత్త్వవాదం
* హెగెల్
గతితార్కిక భౌతికవాదం
విగ్రహవ్యావర్తని (నాగార్జునకృతులు)
* రత్నావళి ,,
* చతుఃస్తవం ,,
మాధ్యమిక వింశతి ,,
* భవసంక్రాంతి సూత్రవృత్తి ,,
నిర్వాణ ప్రకరణం ,,
ప్లేటో ఆదర్శరాజ్యం ,,

**నవలలు**

కీలుబొమ్మలు
రాగరేఖలు
జఘనసుందరి
పాపికొండలు

**నాటికలు**

సునీథ
భిక్షాపాత్ర
యాదవ ప్రళయం
దానధార
ధమ్మిల్లం
ఆదర్శ శిఖరాలు
ప్రతిక్రియ
స్వర్గమా? నరకమా?
డమడమాలబండి
పాడుసంఘం
విధినిర్ణయం
తమ్మపడిగ
ఫ్రెంచి కామెడీ

**సాహిత్య విమర్శ**

కావ్యజగత్తు
Studies in Kalapoornodayam
నవతోరణం
తెలుగులిపి సంస్కరణ

**నాటకాలు**

* బొమ్మ ఏడ్చింది
ప్రతిమ (భాసనాటకం

**కావ్యాలు**

వరూధిని
శివరాత్రి
యుగసంధ్య

**కథాసంపుటాలు**

ఉదబిందువులు
చైత్రరథం